Reg. No




# అభినవసరస్వతి

యిది యొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జనపతి పట్టాభిరామశాస్త్రిచే
ప్రకటింపబడుచున్నది.

జనపాడు.

సంపుటము 18 | 1926 సం॥ ఏప్రిల్ నెల | సంచిక 1

## విషయములు.




చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, పెనికేపల్లి.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, బ్రాహ్మణకోడూరు.
౩ ఖాకరాజు పరాంకుశరావుదేశాయిగారు, యాదవరం.
౪ రామలింగు గారు—నెల్లుట్లసాపురసంస్థానముల మేనేజరు— నెల్లుట్ల.

# పోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు.
౨ ఎనమంద్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
౩ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, [illegible]
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజ్జంపాడు.
౬ శ్రీరామయోంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి, దేశముఖుగార్లు— [illegible]
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జోనగాం
౧౧ నెల్లుట్ల నరసింహారావుగారు, జోనగాం
౧౨ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.
౧౩ టేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౪ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు
౧౫ పిడుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౬ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, సిరిసిల్ల.
౧౭ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానకొండూరు

---

# సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చెంట్, కాకినాడ
౩ సంగెం రామారావుగారు, సంగెం
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ వంగావఝ్జల రంగయ్యగారు, నర్సారావుపేట
౭ నారాయణరావుగారు, దాతారుపల్లె
౮ బేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట
౯ రాయచూరి బండేరావుగారు. [illegible]

# అభినవసరస్వతి.

సంపుటము ౧౮ | జానపాదు క్షయ సం॥ అధిక చైత్రమాసము | సంచిక ౧

## — • గుంటూరు మండల వేదప్రవర్తకవిద్వత్పరీక్షా సభ • —

శ్లో॥ యోఽనధీత్య ద్విజో వేదా నన్యత్ర కురుతే శ్రమం
స జీవన్నేవ శూద్రత్వ మాశు గచ్ఛతి సాన్వయః॥ (పరాశరమాధవీయము)
కుక్షౌ తిష్ఠతి యస్యాన్నం వేదాభ్యాసేన జీర్యతే
కులం తారయతే తేషాం దశపూర్వాన్ దశాపరాన్
వేదవిద్యావిహీనస్య విద్యాజాలం నిరర్థకం
మాంగల్యతంతుహీనాయాః కన్యాయాః కనకం యథా
వేదవిదేభ్యో దత్తం దత్తం, ఇష్టజనైస్సహ భుక్తం భుక్తం
ప్రియతమయాసహ సుప్తం, సుప్తం, శేష మదత్త మభుక్త మసుప్తం॥

ఏబ్రాహ్మణుఁడు వేదములఁజదువక యితరవిద్యాపఠనమున శ్రమచేయునో యాబ్రాహ్మణుఁడును దద్వంశజులును బ్రతికియుండఁగనే శూద్రులనఁబడుదురు. ఎవఁడు తిన్నయన్నము వేదాభ్యాసపరిశ్రమముచే జీర్ణించునో వాఁడు స్వవంశజుల నిటు పదితరములవారిని నటు పదితరములవారిని దరింపఁజేయును. వేదవిద్యావిహీనుని విద్యయంతయు మాంగల్యతంతుహీనయగు కన్యధరించినయితరసువర్ణాభరణములవలె వ్యర్థము- వేదవిదున కిచ్చిన విత్తమే విత్తము- ఇష్టజనులతోఁగూడి తిన్న యన్నమే యన్నము- ప్రియురాలితోఁజేసిన శయనమే శయనము- కాని తక్కటిదానము దానముగాదు - అన్న మన్నముగాదు - శయనము శయనముగాదు. అట్టివేదవిద్యాప్రచారము ప్రకృతము బొత్తిగా సన్నగిలినది. కట్టు బొట్టు జుట్టుదగ్గఱనుండి మార్చి స్వధర్మచ్యుతులై బ్రాహ్మణులు నామమాత్రావశిష్టులై యున్నారు. బ్రిటీషు ప్రభుత్వమువచ్చిన తర్వాత ౧౦౦కి ౯౦ మంది రాజకీయవిద్యాలోలురై తదీయవేషభాషలనే యవలంబించి స్వధర్మమును మఱచిపోఁజొచ్చుచున్నారు.

స్నాన సంధ్యావందన బ్రహ్మయజ్ఞ పితృతర్పణాది నిత్యనైమిత్తికకర్మములయం దనాదరము వహించుచున్నారు. సత్కర్మముల నాచరింపనివార లాచరింపకపోఁగా నాచరించువారిగూడఁ జాల సంకుచితముచేయుచున్నారు. చతూరాత్రదీక్షతో నిర్వర్తింపఁదగిన వివాహోపనయనములు చతుర్ఘటికలలో దేవాలయములందుఁ జేయ మొదలుపెట్టి తుద కిండ్లలోఁగూడఁ జేయ సాహసించుచున్నారు. ఎట్లో శ్రాద్ధాదుల నాచరింపఁదలఁచినను విధ్యుక్తముగా వానిని జేయించువారు కనుపట్టకున్నారు. సాంగాధ్యాపకులు కాకున్నను వివాహోపనయనములుచేయించువారుగాని కుదరక దద్దినమంత్రము

వచ్చినవారుగూడ వరుదగుచున్నారు. బ్రాహ్మణుల స్థితి యిట్లులుండుటచేతనే బ్రాహ్మణేతరులకు వీరిపై భక్తి శూన్యమగుచున్నది. శూన్యమగుటయే కాక ద్వేషముగూడ హెచ్చుచున్నది. అట్టి ద్వేషముచే వారిహక్కులయిన యాజనాధ్యాపనప్రతిగ్రహము లకు నందఱును బెనఁగులాడుచున్నారు. మాయిండ్ల శుభాశుభకర్మముల మేమే చేయించుకొందుమని ముందు విశ్వబ్రాహ్మణులు త్రోవద్రొక్కినారు. వీరివద్ద మంత్రములు నేర్చుకొని కమ్మవారును గడకు వైశ్యులును దన్మార్గ మవలంబించుచున్నారు. పోనిండు లౌకికులు ద్వేషించినను బ్రభుత్వమువారైనను మంచిభావముతో నుండకుండ వారును విరోధముఁ బూనుచున్నారు. ఉద్యోగము లూడగుంజుకొనుచున్నారు. "వర్ణానాం బ్రాహ్మణో గురుః" అను నభియుక్తోక్తి నందఱికిని బ్రథముఁడైన బ్రాహ్మణుఁడు ప్రకృత మందఱికిని గడను ద్రోయఁబడినాఁడు. వీ రెంతబుద్ధిచాకచక్యముగలవారలైనను నెంత రాజకీయవిద్య పఠించినను దుదకుఁ బోసికొనుటకుఁ నీళ్ళులేనికాల మాసన్నమైనది. శ్లో॥ యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతి భారత। అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహ మనిచెప్పిన భగవానుఁ డిట్టివైపరీత్యముగల్గినసమయమున నేదోయొకరూప మున నవతరించి మరల లోకమును బాగుపఱుపకయుండఁడు. ఆయన రామచంద్రేంద్ర సరస్వతీ (అప్పావధాని) స్వామిరూపమునఁ బ్రకృత మావిర్భవించి బ్రాహ్మణసంఘో ద్ధారకమైన యొక రాజమార్గమును నిర్మించుచున్నాఁడు. విస్మృతమగుచున్న వేదవిద్య నుద్ధరింపఁజూచుచున్నాఁడు.

వేదప్రవర్తకవిద్వత్పరీక్షాసభను సిద్ధముచేసినాఁడు. ఈసభయొక్క యుద్దేశము కేవల ఋగ్యజుస్సామవేదములను బూర్వోత్తరమీమాంసలను బ్రచారములోనికిఁ దెచ్చుటయే. ఈసభ ప్రతివత్సరము వైశాఖ శు ౫ నాఁడు చేయఁబడుచుండును. సభాకార్యముల నిర్వర్తించుట కొక పరీక్షాధికారియు నొక కార్యదర్శియు నొక కోశాధికారియు నుందురు. వేదములో ప్రశ్నము ౧ కి ౧ రూ ౪ ల చొ॥ ౧౩ ప్రశ్నములు పరీక్షనిచ్చిన విద్యార్థికిని దదుపాధ్యాయునకును జెతీ రు. ౫౦ లు సత్కారముచేయఁబడును. విద్యారణ్యముననుసరించి ఆ ప్రశ్నముల యర్థమును సభలోఁ బరీక్షనిచ్చువారికి, ప్రశ్నము ౧ కి ౧౨-౮-౦ ల చొ॥ రు ౧౧౬ లు బహుమాన మీయఁబడును. పూర్వమీమాంసా శాస్త్రము పూర్తిగాఁ బరీక్షనిచ్చినవారికి రు ౧౧౧ లును నెలలును బంగారు పతకమును బహుమతిగా నీయఁబడును. ఇంకను షోడశకర్మములలోఁ బరీక్షనిచ్చినవారికిని గొంతసత్కారము చేసెదరు. బ్రాహ్మణులు ధనార్జనముకొఱకుఁగా మ్లేచ్ఛభాషాది విద్యల నభ్యసించి స్వధర్మముల నుజ్జగించుచున్నారు. శ్లో॥ కాకమాంసం శునోచ్ఛిష్టం స్వల్పం తదపి దుర్లభమనునీతి నట్లులైనను జీవరకుఁ ద్రోయఁబడుచున్నారు. అందుచే ధనాశ పెట్టినఁగాని మనవారు మరల వేదాధ్యయనమునకుఁ గడంగరని శ్రీస్వాములవారీమార్గమును వెదకినారు. అప్పుడే గడచిన సం॥ ౧౨ మంది పరీక్షలిచ్చి

బహుమతిపడసియున్నారు. ఈసం॥ పరీక్షకుంకను సంఖ్య యధికమైనది. ఈ సం॥ వేదప్రవర్ధకవిద్వత్పరీక్షాసభ శంకరజయంతినాఁడు వైశాఖ శు ౫ ( 16-5-26 ) నర్సారావుపేటలో జరుపఁబడును. ఒకముహూర్తమేని యొకయింటనుండి యొకరితో మాటలాడక శుద్ధవిరాగులై యొదిండ్ల మాధుకరాన్నము గుడుచుచు దేవాలయధర్మసత్రాదులలో దినమొకయూరఁ గాలముగడపుచు సర్వదా యాత్మానుసంధానమొనర్చుచుండెడి స్వాములవారు ప్రకృత మిక్కార్యమున బద్ధకంకణులై యూరూరికి స్వయముగాఁ దిరుగుచుఁ జందాలు వసూలుచేసి కోశాధికారివశము చేయుచున్నారు. ధనాశచేఁ జెక్కుండ్రు వేదాధ్యయనము చేయుచున్నారు. ఉపాధ్యాయులు చేయించుచున్నారు. అమరావతి పొన్నూరు వంగోలు బాపట్ల గుంటూరు కొల్లూరు మున్నగునూళ్లఁ బాఠశాలలే యేర్పడినవి.

పొన్నూరు వేదపాఠశాలలో భావనారాయణ దేవాలయధర్మకర్తలగు చింతపల్లి దొరసానిగారన్నమును నమరావతి పాఠశాలలో మారేపల్లి పిచ్చయ్యగారన్నవస్త్రములను రెండును విద్యార్థుల కిప్పించుచున్నారు. కావున నో బ్రాహ్మణబాలకులారా! రాజకీయవిద్యలు చదివి యున్నతోద్యోగములుచేసెడి దినములు తిరిగిపోయినవి. రండు - వేదశాస్త్రములఁ బఠింపుఁడు. బహుమానములు పొందుఁడు. స్వధర్మమున నిల్చి యశోధనము నార్జించి యభివృద్ధిఁ జెందుఁడు. ఉపాధ్యాయులారా! ఇఁకనైనను దురన్న దుర్దానముల కాశింపక నీచసేవమానుకొని విద్యార్థులను జేర్చుకొని వేదశాస్త్రముల వృద్ధికిఁ దెండు. యథాపూర్వముగా బ్రాహ్మణ్యమును బ్రతిష్ఠింపుఁడు. ఇంతియొకపరి యేతత్సభానిబంధనములు మున్నగునవి తెలిపెదను.

## నిజాంరాష్ట్ర ప్రశంస

సీ॥ ప్రాచీన కావ్యముల్ పరితిగృహాంతరమున నిలువక చీకి జీర్ణించుచుండె
పూర్వ శిల్పాలయంబులు నేలమట్టమై పొంకమంతయుఁ గోలు పోవుచుండె
దేశీయ రాజన్య దివ్యచరిత్రముల్ తెలుపు కావ్యములు గతించుచుండె
పారతంత్ర్యమ్మునఁ బ్రతిబాలుఁ డనదయై మాతృసేవావృత్తి మఱచుచుండె .
తే॥ గీ॥ నాయకుండెవ్వఁ డాత్మార్పణంబొనర్చి తల్లిబాసకు మేల్గూర్పఁ దలఁపఁడయ్యె
ఆంధ్రవాఙ్మయమునకు సహాయమైన నలుపఁగారాదె తల్లి నిజాముభూమి॥
సీ॥ కాకతీయుల పరాక్రమ చరిత్రమ్ములు దేశీయు లింక సాధించలేదు
సత్కవి వర్యుల జన్మప్రదేశముల్ విజ్ఞానధను లింక వెదుకలేదు
వృద్ధులు దెలిపెడు వివిధ చరిత్రముల్ గ్రంథస్థమును జేయఁ గడఁగలేదు
ఆంధ్ర రాజన్యుల యవ్యాహతయశంబు వాఙ్మయంబున భద్రపఱుపలేదు

తే॥ గీ॥ పారతంత్ర్యంబుకొఱకయి ప్రాణ మొసఁగి కీర్తిగాంచినయాంధ్రులరక్తములు
భూమిలో శాశ్వతత్వంబుఁ బడయలేదు శాంతి నీకెందుకమ్మ నిజాముభూమి ॥

సీ. సారస్వతంబును శౌర్యంబు సమముగాఁ గైసేసె మున్నోరుగల్లుపురము
కత్తిని నాంధ్రవాఙ్మయమును నొకరీతిఁ జవిచూపె గణపతి చక్రవర్తి
మాతృదేశార్థమై మానినియై శౌర్యదీప్తినించెను రుద్రదేవిరాజ్ఞి
శైవంబు రాజ్యంబు సమముగా వెలయించి తేజుగూరిచె శివదేవమంత్రి

తే. గీ. మతము శౌర కాంధ్ర సామ్రాజ్య మధ్యమందు శాంతిలోకంబుఁ జేరిరి జైనవరులు
నాటి విఖ్యాతవృత్త మీనాఁటికైన సాటరాదఁటె తల్లి నిజాము భూమి ॥

సీ. సర్వజ్ఞసింగమ క్ష్మానాయకుని కీర్తి కల్పితంబనె నొక్క కావ్యకర్త
బమ్మెర పోతన భక్తాగ్రగణ్యుని నొంటిమిట్టనుజేర్చె నొక్క ఘనుఁడు
కాళీశ్వరచరిత్ర కాళహస్తికిఁ బెట్టి ప్రచురించె నొక కావ్యపారగుండు
వేములవాడను వేములవాడగా ముడిపెట్టె నొక కళాబోధకుండు

తే. గీ. చిక్కనందాఁక నాంధ్రుల చిరయశంబు కన్నడుల నెత్తిపై నంటఁగట్టెనొకఁడు
పూర్వవిఖ్యాతి ఈరీతి పోవుచుండె శాంతిగానుండకమ్మ నిజాము భూమి ॥

సీ. భారతంబును తెలబట్టి తిక్కన సోమయాజి పఠించిన యాంధ్రనగరు
ఘోరశైవము పాలకుర్తి సోమనకవి యలరారఁజేసిన యాంధ్రనగరు
పాశ్చాత్య శోధక ప్రతతిచే వేనోళ్ళ వాదరోక్తులుగొన్న యాంధ్రనగరు
పరశురామకవులుండు గురుమూర్తి వేదవేదార్థముల్ నించిన యాంధ్రనగరు

తే. గీ. పూర్వవిఖ్యాతి లవలేశమునకుఁ దగిన గురుతు గనకుంటి నీశాక శాంతినుమ్మ
యాత్మతేజంబులో సహస్రాంశమైన జాలువారింపు మిచట నిజాముభూమి ॥

సీ. భువనగిరీ దుర్గమునుజూచి యాంధ్రుల దివ్యప్రభావంబు దెలియవచ్చు
రామప్ప గుడుల యారజముచే నాంధ్రుల శిల్పశక్తిని దెలిసికొనవచ్చు
ఓరుగల్లుకోట నూహించి యాంధ్రుల శేముషీబలము చర్చింపవచ్చు
పాకాలచెఱువు చెల్వముఁ జూచియాంధ్రుల యైశ్వర్య విభవంబు లరయవచ్చు

తే. గీ. చిరయశమ్మునుగాంచిన చిహ్నలింక దేశ చారిత్రములను చిత్రించునరకు
నిలువకుండునె యనుచుఁ జింతింపవలదు శాంతి కిదివేళగాదు నిజాముభూమి ॥

సీ. ప్రతిబాలకుండాంధ్ర భాషలో విజ్ఞాన సాహిత్య విభవముల్ సంగ్రహించి
ప్రతిసాధ్వియును నాంధ్రభాషలోఁ గావ్యకల్పనము గావించెడి ప్రజ్ఞఁబడసి
ప్రతియువకుం డాంధ్రభాషకై సర్వసంగత్యాగ మొనరించు కడిమినొంది
ప్రతిధనికుం డాంధ్రభాషకై సర్వస్వమర్పించు త్యాగ రహస్యమెఱిఁగి

తే. గీ దేశమున నల్గడల నాంధ్రదేశకీర్తి సముదితోత్సాహ వంతమై సాటుచుండఁ
గాంచి సంతోష మంది పేశాంతమందు నరయుచుండు నిజాము రాష్ట్రాభిమాని

సీ. ఆంధ్రులెల్లరు పత్రికాదికంబుల వెనుదీయక వ్యాసముల్ వ్రాయునెప్పుడో
ధనవంతులెల్లరు తల్లిబాసకు సేవ సలుపగా ముందు నిలుచునెప్పుడో
కులకాంతలెల్లరు తెలుగు కావ్యంబులు చిత్రచిత్రముగ రచించునెప్పుడో
ముసలిమానులు నాంధ్రముఖ్యులు మాతృసేవాధర్మముల గొడం బడునెప్పుడో
తే. గీ. ప్రతిగృహంబున పత్రికా పఠనవాణి కర్ణపేయంబుగా విన గలుగునెప్పుడో
యట్టి సుదినంబు గోలకయి యనవరతము నరయుచుండు నిజాము రాష్ట్రాభిమాని

## — అస్పృశ్యతానివారణాఫలము —

ఆర్యులారా! మనభారతీయులు తమనాగరికధర్మానుసారము కృతత్రేతాద్వాపరకలియుగములని విభజించి నాలుగు పేరులు పెట్టిరి. ఇట్లే యూరోపాదేశీయులు క్రమక్రమముగా వృద్ధినొందిన తమ నాగరకత ననుసరించి యంధకారయుగమనియు మధ్యయుగమనియు నూతన యుగమనియుఁ బేరులిడుట ప్రపంచచరిత్రవిషయ మెఱింగినవార లందఱకు విదితమేకదా! మన నాగరికత ననుసరించి యేర్పఱుపఁబడిన నాలుగు యుగములకు “కృతేతుమానవాధర్మా స్త్రేతాయాం గౌతమాస్స్మృతాః, ద్వాపరే శంఖలిఖితాః కలౌ పారాశరాస్స్మృతా” యను స్మృతివాక్యప్రకారము నలుగురు స్మృతికర్తలు తత్తద్యుగానుసార మొకరికంటె నొకరు ధర్మకాఠిన్యమును దగ్గించుచువచ్చిరి. అట్టి యుగచతుష్టయములోఁ బ్రస్తుత కలియుగమునఁ బరాశరస్మృతిధర్మము లనుష్ఠింపవలసియున్నవి. కావుననే “స్వగ్రామే పూర్ణమాచార మన్యగ్రామే తదర్ధకం, పట్టణే పాదమాచారం పథి శూద్రవదాచరే” త్తని నిర్ణయించిన పరాశరుని వేనోళ్ళఁ బొగడవలదా? కలి యయిదువేల సం॥ ప్రాంతమందు శ్రీమన్నీలకంఠచటోపాధ్యాయుని పుత్రి శ్రీమతి సరోజినీచటోపాధ్యాయిని డాక్టరు గోవిందరాజులునాయనిఁ జెన్నపురి బ్రహ్మోపాసన మందిరమందు బ్రహ్మోపాసకుల సమక్షమందు విధియుతముగా వివాహమాడెనని యాంధ్రపత్రికలోఁ జదువుభాగ్య మబ్బె “కలౌ పంచసహస్రాణి జాయతే వర్ణసంకరః” యను వాక్యప్రకారము యుగధర్మము నెఱవేఱినందుల కానందమయ్యెను. పూర్వమా శాస్త్రసమ్మతము కాకపోయినను నొకవర్గములోని పురుషుఁ డొకవర్గములోని స్త్రీని భోగినిగా నుంచుకొనుట జరుగుచుండెడిదికాని పైజాతి స్త్రీ క్రిందితరగతి పురుషుని వివాహమాడిన ట్లగుపడదు.

కలిధర్మములలో “కన్యానా మసవర్ణానాం వివాహశ్చ ద్విజన్మనా” మని సవర్ణస్త్రీకే సవర్ణపురుషుఁడు వివాహమాడవలసినట్లు విధియుండఁగా నిట్టివివాహమాడుట ధర్మవిప్లవముగాదా? శ్లో॥ కలౌ పంచసహస్రాణి జాయతే వర్ణసంకరయను రీతి నిట్లగుట యుక్తమేయని యనినచో “జాతస్య మరణంధ్రువ” మని తండ్రి పుత్రుని మరణ మంగీకరించునా? ప్రాణములు కంఠగతములగు వఱకుఁ జికిత్సచేయించ

డుగా ? మరణించినపుత్రునికై యడలకుండు తండ్రి లోకమునఁగలఁడా ? యోచింపుఁడు. అట్లే ధర్మవిప్లవమైనప్పుడెల్ల సనాతనమతానుయాయు లందఱు దురపిల్లుదురు. ప్రస్తుత మార్యసమాజ బ్రహ్మసమాజాదులు బయలుదేరి వర్ణసాంకర్యమును ధారాళముగా బోధింప నారంభించినవి - వర్ణసంకరప్రవర్తిప్రేసరుఁడగు గాంధిమహాత్ముని బోధలన్నియు నాచరించుట మానినను బలువు రీయస్పృశ్యత మహాపాపమని నివారణకై పాటుపడుచుండుటయుఁ బాటుపడుఁడని మహాత్ముఁడు బోధించుటయు స్వరాజ్యమునకేకదా ! చూచితిరా కలికాలమహిమ ? మనుజుని ప్రధానాంగమగు శిరమునందున్న చెవి కన్ను ముక్కులలోఁ గండమాలినివారణార్థము పెట్టుకొనిన తనవ్రేలు కడుగకుండ నావ్రేలుగల చేతితోనిచ్చిన నీరుత్రాగుట కా శిరమునందేయున్న నోరు సహించదే. కనుకఁ బరాశరస్మృతిలోని యాచార ప్రాయశ్చిత్త కాండలు వ్యవహారములో నున్నంతకాలము తత్స్మృత్యనుయాయులగు జనుల కంఠములోఁ బ్రాణమున్నంతకాలము నీయస్పృశ్యతా నివారణమున కొప్పుకొందురా ? ఇయ్యది యైకమత్యమను వృక్షమునకు వేలుపురుగువంటిదై మొదటికే మోసమొనర్చునా ? మన హిందువులలో నొకటేజాతిలో జన్మకుఁ బ్రథమకర్మమగు గర్భాధానమున కనుకూలమగు స్త్రీ రజస్వలయైనచో “ ప్రథమేహని చాండాలీ ద్వితీయే బ్రహ్మఘాతకీ, తృతీయే రజకీప్రోక్తా చతుర్థేహాని శుద్ధ్యతి ( [illegible] ) యనువిధిచే నాస్త్రీని ముట్టుకుండుట స్త్రీజాతి నవమానించుటయగునా ?

ఇట్లు భార్యనంటుకుండుదానియందు ధర్మ కనిష్టమని యెవరేని చెప్పసాహసింతురా ? ఇంకొక దృష్టాంతమునుగనుఁడు. మేనత్త మరణించిన మేనల్లున కాశౌచమని స్మృతి విధించినది. వాఁడేడాదిబాలుఁడు. అట్టిబాలున కన్నము తినిపించినతల్లి స్నానముఁజేసినఁగాని యింటి మఱొండువస్తువు ముట్టదే. ఇది పుత్రునియం దనిష్టమా ? లేక శాస్త్రనియమబద్ధమా ? యోచింపుఁడు. అట్లే శాస్త్రనియమము కొందఱిని ముట్టకుండుటకుఁ గారణముగాని వారియందలి విరోధముగాదు. సోదరులారా ! శ్లో॥ రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః పాపే పాపపరాస్సదా । రాజాన మనువర్తంతే యథా రాజా తథా ప్రజా॥ అను శాస్త్రప్రకారము జాతినియమరహితప్రభుపాలనముగానఁ దప్పనిసరియై చండాలురను ముట్టుచుంటిమి. ఇది శాస్త్రవిహితమని యనకుఁడు. అట్లుండునేని యాచారప్రాయశ్చిత్త కాండలను బరాశరస్మృతినుండి విడఁదీసి తగులఁబెట్టుఁడు. ఒకవేళ “ సంతసర్కారులలో సంగడికైలులో స్పర్శదోషంబులు సమసిపోయెను ” నన్నట్లు ప్రస్తుతము సంతలు దేవోత్సవములు మున్నగువానిలో విధిలేమిఁ జండాలాదుల నంటినను సనాతనవేదమతానుయాయులు శాస్త్రోక్తమగు స్నానాదివిధు లాచరించుచునేయున్నారు. ఇంకొక విపరీతసిద్ధాంతముగనుఁడు. భగవద్గీతలలోని “ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః ” యను వాక్యమునకుఁ బూజ్యులందఱు బహుగ్రంథములందు

నర్థావబోధకములగు వ్యాఖ్యలును నిర్మించిన శ్రీమచ్ఛంకరభగవత్పాదాదుల యనుభవార్థములను విడిచి కొందఱు పాశ్చాత్యవిద్యావ్యామోహితులు నవనాగరికులమని విఱ్ఱవీఁగుచు మనుజుని గుణకర్మములనుబట్టి జాతినిర్ణయముచేయవలయునని స్వకపోలకల్పితార్థమును జెప్పుట సంకరయోగమాహాత్మ్యముగాక మఱేమనవచ్చును? అనుభవములోఁ జూపెద. శ్రీమత్పోలవరము జమీందారుగారు పుట్టినది బ్రాహ్మణజాతిగదా! జమీందారై ప్రభుత్వగుణముండుటనే క్షత్రియుఁడు. పోలవరపు టేజన్సీలోని కఱ్ఱినమ్ముటచే వైశ్యుఁడు. ఆయనయే యుద్యోగాదిరాజసేవావృత్తి నవలంబించుటచే శూద్రుఁడు. ఇట్లొకజన్మములోనే యిన్నిజాతులుగా మాఱవలసియుండఁగా గుణకర్మములనుబట్టి జాతినిర్ణయముచేయుట కెట్లువలనుపడునో యోచింపుఁడు.

అస్పృశ్యులన మాలమాదిగవారేగాక పైజాతివారి కీకలిలోఁ గ్రిందిజాతివారందఱు నస్పృశ్యులేగదా! ఈయస్పృశ్యులలోఁ గోటీశ్వరులేకాక భూపరిపాలకులగువారు గూడఁ గలరే. పోనిండు. ఈయస్పృశ్యతవలనఁ బూర్వము శ్రీకృష్ణదేవరాయాదుల యాంధ్రరాష్ట్రస్థాపనకుఁగాని శ్రీ ఛత్రపతి శివాజిగారి మహారాష్ట్రరాజ్యస్థాపనకుఁగాని యాటంకముగలిగెనా? శైవమతానుసారము నందుని కైలాసప్రాప్తికిఁగాని, వైష్ణవమతానుసారము తిరుప్పాణియాళ్వారుగారి వైకుంఠప్రాప్తికిఁగాని యడ్డులేని యస్పృశ్యత యిప్పుడేందులకు నివారణ కావలెను? హిందూదేశపుఁ బ్రధానవృత్తియగు వ్యవసాయములో బ్రాహ్మణశూద్రచండాలురు మువ్వురుఁ గలసి పనిచేయునప్పుడు కోసినపైరు కళ్ళమునకుఁ జేర్చుటకు మోపులుకట్టి మధ్యవర్తియగు శూద్రుఁడు బ్రాహ్మణచండాలుర కిద్దఱకు మోపులెత్తి తానొక మోపునెత్తుకొని కార్యసాఫల్యమొందుచు నన్యోన్యసహకారముతో నుండ నీమాలమాదిగలను నిరాదరణచేయుచుండిరనుట లోకజ్ఞానముగలవారలకుఁ దగునా? ఈకృషివృత్తిలో సహకారమేకాక నిమ్నజాతీయుఁడగు పాలేరువానికిఁ దనకంటె ముందు పొలిచుట్టి పొలిచేటవిచ్చెడి యాచారమేకాక యాపాలేరుభార్యమగని కన్నముదెచ్చిన దుత్తలోపలికిఁ గళ్ళములోని నానాధాన్యములు గ్రహించుటయేకాక ముందుకాసిన కాయగూరలు యజమానునికన్న ముందే చూచిచూడకయుండ గ్రహించుట వ్యవసాయికుల కందఱకు ననుభవైకవేద్యమేకాని నవనాగరికుల కేమియెఱుక? ఒకవేళ నీమాలమాదిగలఁ జేరఁదీసిన హిందువులకు స్వరాజ్యము ప్రభుత్వమువారొసంగెదరన్నచో నేకమతైకజాతిలోని రోమన్ కాథోలికులగు నైర్లండువారి కిచ్చుటకు సమ్మతించిరా? పోనిండు. విగ్రహారాధకులగు కాథోలికుల కిచ్చుటకు సమ్మతించకున్న మానెఁగాని క్రీస్తుశకము 1588 సంవత్సరప్రాంతమందుఁ బ్రోటెస్టంటులగు స్పెయిన్ వారి నేమాత్రమాదరించిరి? ఇటీవల 1914 మొదలు 1918వఱకు నాలుగువత్సరము లేకమతమున నేకజాతినే కాక యేకకుటుంబములోఁ జేరి శ్రీమద్విక్టోరియామహారాణిగారి మనుమలగు జార్జి కెయిజరు లొండొరులు కత్తిదూసినది చారిత్రికవిషయమేకాక కనులారఁ జూచియుంటిమే!

ఇట్లే ద్వాపరాంతమందుఁ బినతండ్రి పెదతండ్రి బిడ్డలగు పాండవ కౌరవులకును రాజ్యకాంక్షచే యుద్ధములు పొసఁగక తప్పవయ్యె. కావున బ్రహ్మసామాజ ఆర్యసామాజికాదులచే సువార్తలుగా బోధింపఁబడు వర్ణసాంకర్యమును సిద్ధాంతీకరించుటకై యవతరించిన గాంధిమహాత్ముఁడు తనపని దాఁ జేసిచనుచున్నాఁడని గ్రహింపుఁడు. లేకున్న మున్ముందు బోధించిన బహిష్కారాదు లిపుడు వదలి యస్పృశ్యతా నివారణయే చేయుఁడని యేల బోధించును? ఆయన మహాత్మశబ్దమున కనుగుణముగా దూరదర్శియగుటచేతనే తనసిద్ధాంత మంగీకరించి పంచబహిష్కారాదు లాచరించినచో నొకయేఁడాదిలో స్వరాజ్యమిప్పించెదననఁగా సంధికొడంబడని కౌరవులవలె నాయన యాజ్ఞ నుల్లంఘించిన హిందూప్రజాసామాన్యమం దస్పృశ్యతా నివారణ మహామంత్రము మాత్రము స్థిరపఱచెను. మున్నొక మహాత్ముఁడు కొండ మోసెదననఁగా నెట్లు మోయఁగలవన మీరంద ఱెత్తి నా నెత్తిని బెట్టుఁడు, మోయుచున్న శిక్షించుచుండెనెనఁట. నే నెఱింగినదొకటి విన్పించెద - ఒకరససిద్ధుఁడ నని పల్కు వానిని బంగారుచేయు సాధన మేమని శిష్యుఁడడుగ వేపచెట్టు రావిచెట్టుఁ గలసిన తొఱ్ఱఁబుట్టిన యూరదొండ వేరు సంగ్రహించి తెచ్చినచో బంగారుచేసిచూపెద ననఁగా శిష్యుని జీవితమంతయు ధారవోసినను నయ్యది లభింపదయ్యె. అట్లుగాక మహాత్ముఁడు ప్రజలుచేయఁదగినదియు మున్ను వ్యాసాదులు బోధించినదియు నగు పంచవ్యసనముల మానుటయే కాక కొంత కాలము పంచబహిష్కారములు సలుపుఁడని బోధించి యయ్యవి చేయఁజాలని హిందూ ప్రజల కస్పృశ్యతా నివారణమాత్ర మంటఁగట్టెను.

కాన రాజ్యముల వృద్ధిక్షయములకును రాజుల నిరంకుశ ప్రజాసమ్మతపరిపాలనములకును బూర్వపుహిందూ రాజులచరిత్రలే కాక యాంధ్రపత్రిక నలసంవత్సరాదిసంచికలో 224 మొదలు 231 పుటలవఱకున్న తురుష్కసామ్రాజ్యవృద్ధిక్షయము లను వ్యాసమును 232 పుట మొదలు 235 పుటవఱకున్న జపానుదేశవిజృంభణ మను వ్యాసమును 236 పుట మొదలు 247 పుటవఱకున్న యాంగ్లేయసామ్రాజ్యచరిత్రమందలి యధ్యాయములుగా వ్రాయఁబడిన వ్యాసము నొకసారి స్వాభావికబుద్ధితో సవిమర్శముగాఁ బఠించినయెడల నవనాగరికులకే కాక జాతీయవాది మితవాది జస్టిసువాది స్వరాజ్యవాద్యాదుల కందఱకు బోధపడకమానదు. కాన స్వరాజ్యప్రాప్తి కస్పృశ్యత యడ్డుపడనేరదని నమ్ముఁడు. మున్ముందు మహాత్ముఁడు బోధించిన పంచబహిష్కారములు చేయుటయే కాక వ్యాసులు బోధించిన పంచవ్యసనములును మాని స్వరాజ్యలక్ష్మి కలంకారప్రాయమైన స్వదేశవస్త్రనిర్మాణధారణాదులు హిందూదేశవాసు లందఱుఁ జేయుచు నందుమిగిలిన ధనమును మద్యపానమునకై ధారవోయకుండునట్లు నేతగాండ్రను దదితరులను గాంగ్రెసువారును దదితరులును హెచ్చరించుచుందురుగాకయని విన్నవించుచు నీసద్బుద్ధి మనకందఱకు నొసంగుటకై సర్వేశ్వరుఁ బ్రార్థించుచున్నాఁడను.

## జయవత్సరే శుభకర్మార్హ కాలనిర్ణయః

మాండవ్యః॥ షష్ట్యంతే వర్జయే దబ్దం షణ్మాసంవా వివర్జయేత్ త్రిమాసం మాసమేకంవా శుభకర్మసు సర్వదా ॥ఇతి॥ అస్య వ్యవస్థా మాహ భాగురిః-వింధ్యస్యోత్తరదిగ్భాగే షష్ట్యంతే వత్సరంత్యజేత్।తస్య దక్షిణదేశేతు త్రిమాసం వర్జయేత్సదా ॥ అంగవంగకళింగేషు మాస షట్కం వివర్జయేత్ ॥ఇతి॥ బాదరాయణోపి - ఆంధ్రదేశేతు సర్వత్ర త్రిమాసం వర్జయేత్సదా। ప్రభవాదౌతుమాసస్యాత్సర్వకర్మసు గర్హితః ॥ఇతి॥ యద్యపి పూర్వోక్తవచనైః షష్ట్యంతభూతజయవత్సరే మాసత్రయం ప్రభవాబ్దే చైకంమాసమేవ వర్జయేదితి స్పష్టం ప్రతీయతే। తథాపి సముత్థాంతరై ర్భాద్రపదాదిసర్వమాసేష్వపి శుభముహూర్తాభావ ఇతిపక్షః ప్రజ్ఞ యం॥

శాయిగూడెం కొండయ్య సిద్ధాంతి.

# లాయరు.

ఇది యొకమాసపత్రిక. ఇందు చెన్నపట్టణమువగయిరా ఏడు హైకోర్టుల తాలూకు శపిలు, క్రిమినలు, రివిన్యూ అనగా యెస్టేటు ల్యాండు ఆక్టు, గ్రామఉద్యోగస్థుల ఆక్టులు, గ్రామపంచాయితీకోర్టు ఆక్టువగయిరా ఆక్టులపయినిజారీకాబడు అన్ని ముఖ్యమయిన తీర్పుల యొక్క సంగ్రహము మిగుల సులభశైలితో ప్రచురింపబడును. చాలు రకుసహా అర్థముగునటుల దేశరివాజు మాటలతో యీపత్రిక ప్రచురించబడును. ఇంగ్లీషుభాష తెలియనివారికి దీనివిలువవ్రాయ నలవి కాదు. ఈపత్రికయుండు గృహములో సదాఒక ప్లీడరుండి సలహాయిచ్చునటుల నుండును. ఈపత్రిక చదివినవారు కోర్టులలోతిరిగి వేల కొలదిసొమ్ము ఖర్చుపెట్టినష్టమును పొందరు. జమీందార్లకును, ఇనాం

దార్లకును, వర్తకులకును, గ్రామఉద్యోగస్థులకును, ప్రయివేటు వకీళ్ళకును, పోలీసు ఆఫీసర్లకును, కోర్టులతో సంబంధముగల తదితరులకును యీపత్రిక సంజీవినంటిది. ఒకసంవత్సరము యీపత్రిక చదివినవారు తమయావజ్జీవము, యీపత్రికను విడువజాలరు. తెలుగుదేశములో నిటువంటిపత్రిక మరియేదియు లేదు.

సం॥ చందాపోస్టేజి సహా రు 4-0-0. లు

చందా పైకము దరఖాస్తుతో పంపబడవలయును. లేని యెడల ప్రథమసంచిక వి. పీ. పోష్టుద్వారా రు. 4-3-0 లకు పంపబడును. వలయువారు యీదిగువ వ్రాయబడు చిరునామాను దరఖాస్తులు పంపవలెను.

లాయరు ఆఫీసు, మేనేజరుగారికి,

పార్వతీపురము పోష్టాఫీసు.

(విశాఖపట్నం జిల్లా)

బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారికి,

రాబోవు శాసననిర్మాణసభకు ప్రజలవలన ఎన్నుకొనబడువారిని గురించి సనాతనధర్మసమ్మేళనమున దర్భంగా మహారాజగారు నుడివినటుల "మనము వోటివ్వవలసివచ్చినపుడు మనధర్మములను రాజస్థానములందు సర్వవిధముల కాపాడు నిబంధనల నంగీకరించువారికే వోటు నివ్వవలసియున్నది" అనుమాటలను మనరాజధానిలోనివారు జ్ఞాపకములో నుంచుకొనవలెను. ఈవిషయమై ప్రచారము జరుగవలసియున్నది. తమపత్రికలో వోటరులకు హెచ్చరికగలిగించు ప్రబోధ మవసరమని తలంచుచున్నాను. మన ముపేక్షించునెడల దేవాదాయచట్టములవంటివి మనకు రాగలవు. రాచకీయరంగములందు మతసాంఘికసమస్యలు పరిష్కరింపబడుట కూడను.

అటులజరుగునెడల మననూతులు సత్రములు దేవాలయములు నూతనవిధానములకు లోబడగలవు. అస్పృశ్యతను నివారించ దీక్షగలవారెట్టితీర్మానములకైన పాల్పడుదురు. కాబట్టి అట్టివారు శాసనసభలలో జేరి రాచకీయముగ మనకు మేలుచేయజాలకున్నను మతసాంఘికములందు అన్యమతములవారితో గలసి సంకరముగలిగించు నవకాశమును దప్పించుట మన విధియైయున్నది. ఇందుకు దగినవారిని గ్రామములకుబంపి పనిసలుపుట అవసరము. ఇందుపై తమఅభిప్రాయమునుగూడ రాబోవుపత్రికలో బ్రచురింప బ్రార్థించుచున్నాను.

బెజవాడ<br>21–3–26

పెద్దిభొట్ల వీరయ్య,<br>బి. ఏ., బి. యల్.,<br>ప్లీడరు.

...... బ్రహ్మశ్రీ వేదమూర్తులగు జానపాటి పట్టాభిరామ శాస్త్రులవారికి,

నమస్కారములు—

అయ్యా,

...... ఇపుడు శాసనసభాసభ్యులుచేయు అపకారము మీకు తెలియనిదిగాదు ...... ప్రతిపత్రికలోను శాసనసభ్యులుచేయు అపకారములంగూర్చి ముచ్చటించి ప్రజలను తగు ప్రతిక్రియవిషయమై ప్రబోధించవలసినపని ఆస్తికపత్రికల కొప్పినంత కలదు. ఆవిషయమై బ్రాహ్మణ స్వధర్మప్రకాశిని పత్రికలు కొంతవరకు పనిచేయుచున్నవి. కాని అందులో బ్రాహ్మణపత్రిక సకాలమునకు వెలువడదయ్యె. ఆస్తికపత్రికలలో సకాలమునకు వెలువడుచు ఆస్తికబృందములో ప్రచారము కలిగియున్నది తమదియైయున్నది. కాన ...... నాయీమనవిని గ్రహించి నేనీవ్యాసములో ముచ్చటించిన కార్యత

యమును ఆస్తికలోక మాచరణలోనికి తెచ్చునట్లు ప్రబోధింప ...... పాటుబడగోరెదను ...... నావ్యాసములో వ్యాకరణదోషములు విషయదోషములుకూడ యుండియుండును. వానిని సవరించి ప్రకటింపగోరెదను ............

ఇంగువ వెంకటసీతారామశర్మ,
సంతపేట, నెల్లూరు.

# శాసనసభాసభ్యుల యపకారము

సోదరవర్యులారా! మన భరతఖండమున భారతీయ మహమ్మదీయ క్రైస్తవ పారసీకు లనునాలుగు పెద్దజాతులవారు నివసించుచున్నారు. అందు భారతీయులమగు మనము బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లనునాలుగు పరిశుద్ధజాతులుగ నున్నవారము. ఇదిగాక శైవ, వైష్ణవాది మతభేదములు గలిగియున్నాము. మనము ప్రత్యేకజాతిమతాచారములు గలిగియున్నాము; గాని యందఱము నొకటేజాతిమతాచారములు గలవారము కాము. మనకందఱకును ప్రమాణము వేదమును దదర్థ ప్రతిపాదకములగు స్మృతి సూత్ర పురాణేతిహాసాదులును నై యున్నవి. అవి చెప్పినచొప్పున నాయా జాతిమతములవా రాయాజాతిమతాచారములందుఁ బ్రవర్తింపవలసిన వారమైయున్నాము. అట్లే ప్రవర్తించుచు వచ్చుచున్నాము. ప్రజలొకరిద్రవ్యము నొక రపహరించుకొనకుండ రక్షకు లెట్లవసరమో అట్లే మతవిషయములఁగూడఁ బరిపాలింపఁ బరిపాలకు లవసరమై యున్నారు. లేనియెడల నెవరిమతాచారములయందు వారు ప్రవర్తించక యొకరిమతాచారముల నొక రవలంబించి ప్రజలు వర్ణసంకరులగుదురు. కావుననే పూర్వము మనలఁ బరిపాలించుచువచ్చిన క్షత్రి

యుపభులు మనమతాచారములఁ బరిపాలించుచు వచ్చిరి. వారైనను మన మన్వాదిధర్మశాస్త్రము లే యే జాతి మతములవారి కే యే ధర్మములు విధించియున్నవో ఆయాజాతిమతములవారి నాయా ధర్మములయందుఁ బ్రవర్తింపఁ జేయుచు వర్ణాశ్రమధర్మములఁ బరిపాలించుచు వచ్చిరి. అంతియే కాని వారి యిష్టానుసారముగ మత విషయములు సంస్కరించి యీవిధముగ నడువవలసినదని ప్రజలను నిర్బంధించెడివారు కారు. మతవిషయములే యననేల? రాజకీయ వ్యవహారములుగూడ మన్వాదిధర్మశాస్త్రములు చెప్పిన చొప్పుననే తీర్మానించుకొనెడివారు. ఇట్లని మన పూర్వచరిత్రలు చెప్పుచున్నవి. ఇపుడన్ననో మనలఁ బరిపాలించు ప్రభువులు విదేశీయులు. వీరికి మన భాషరాదు. మన మతస్వరూపము తెలియదు. అందుచే మన మతాచారవిచారణ తమపై నుంచుకొనఁదలఁపక "విక్టోరియామహా రాణిగారు" పరిపాలనకువచ్చు సమయమున "మీమతవిషయము లలో మేము జోక్యము కలుగఁజేసికొనము మీరే విచారించుకొనుఁ డని" ప్రమాణపూర్వక లిఖితపత్రము వ్రాసి యిచ్చియున్నారు. ఎడ్వర్డుచక్రవర్తిగారును నాప్రమాణము ననుసరించియే ప్రవర్తించిరి. ప్రస్తుతపరిపాలకులగు పంచమజార్జి సార్వభౌములును నద్దాని ననుస రించియే మొన్న మొన్నటివఱకుఁ బ్రవర్తించుచువచ్చిరి. ఒకచో విదేశీయులే మన మతాచారములఁ బరిపాలింపవలసినస్థితి మనకు వచ్చి నను మన మన్వాదిధర్మశాస్త్రములు చెప్పిన విధముననే పరిపాలింప వలసినవారైయున్నారు. కాని స్వేచ్ఛననుసరించి పరిపాలింప వలసిన వారు కారు. దైవానుగ్రహమున వారాభారమును మనపై నిడిరి. అందువలననే మన మతగురువులగు శంకర రామానుజ మధ్వాద్యా చార్యవర్యులచే స్థాపింపఁబడిన పీఠాధిపు లాభారమును వహించియు న్నారు. కాలగతివలన వారును నిపు డుదాసీనులు కావలసివచ్చినది...

ఇది యిట్లుండ మన భారతీయులలోఁ గొందఱు కలికాలవశంబున నిపుడు కేవల విదేశీయ విద్యావ్యామోహ పరవశులుగను స్వవిద్యాగంధశూన్యులుగను బయలుదేరిరి. బయలుదేరుచున్నారు. వీరికి స్వమతస్వరూపము తెలియదు. అందుచే స్వమతమునం దసూయ మెండు. పరమతములయం దాసక్తి యధికము. వానిని ( పరమతాచారములను ) మనసంఘమునఁ జొప్పింప వీరు బ్రహ్మర్ష్యాదిదివ్యజ్ఞాన సామాజిక సంఘసంస్కారాదివ్యపదేశములతో బయలుదేరి చాలఁ బాటుపడిరి. దానివలనఁ గొంద ఱజ్ఞులు చెడినను విజ్ఞులు వారి మాయలకు లోనుగాకపోయిరి. వారికోరిక పూర్తిగాదయ్యె. అందుతో మన సంఘసంస్కార సోదరులు మనల వర్ణసంకరులఁ జేయ శిక్షావిధి కన్న వేఱొండుపాయము లేదని యెంచి శాసనసభలలో సభ్యత్వపదవి సంపాదించుకొని మతాచారవిరుద్ధములగు చట్టముల నిర్మింప మొదలిడుచున్నారు. ... ... ...

శాసనసభలు ప్రజల కష్టసుఖములను విచారించి రాజకీయార్థికవిషయములలో వారికి సుఖదాయకములగు శాసనములు గావించుటకుఁగా దొరతనమువారిచే నిర్మింపఁబడినవి. ప్రజలు తమతమ కష్టసుఖములను దమపక్షమునఁ బ్రభుత్వమువారికి విన్నవించి తగిన శాసనములనిర్మింపఁ దమలోఁ గొందఱు పురాణవిద్యావిశారదులఁ బ్రతినిధులుగ నెన్నుకొనుచున్నారు. మన సంఘసంస్కారనామధారకులుగూడఁ బైసభలకేగునపుడు మీకుఁ బన్నులఁ దగ్గింపఁ జేయుదుమనియు స్వాతంత్ర్యముఁ గల్పించెదమనియు స్వరాజ్యమును సంపాదించి యిచ్చెదమనియుఁ జెప్పి మనవలనఁ బ్రాతినిధ్యమును సంపాదించుకొనుచున్నారు. అట్లుగాక మన మతవిషయముల సంస్కరించి చట్టముల నిర్మించెదమని చెప్పియుండిన వీరికిఁ బ్రజలలో నొక్కరైనను దమ "ఓటు" నిచ్చియుండరు.

ఈసంగతి బాగుగ గమనించియే మనసోదరులు స్వరాజ్యము సంపాదించియిచ్చెదమను మిషతోఁ బ్రజలవలనఁ బ్రాతినిధ్యము సంపాదించుకొని యటఁ జేరి మనతోఁ జెప్పినమాటల నేటఁ గలిపి మతాచార

విరుద్ధములగు చట్టముల నిర్మించి మనకు వర్ణసంకరరాజ్యమును సంపాదించియిచ్చుటకుఁ బ్రయత్నించుచున్నారు. ప్రస్తుత మిందులకు నిదర్శనము గవర్నర్ శాసనసభాసభ్యులగు పానుగంటి రామారాయణింగారును గవర్నర్ జనరల్ (వైస్రాయి) శాసనసభాసభ్యులగు డాక్టరు గౌరుగారును నైయున్నారు. వీరిలో మొదటివారు దేవాదాయధర్మాదాయశాసనమును రెండవవారు గర్భాధానశాసనమును ప్యాసుచేయించినారు. ఈరెండు శాసనములును వర్ణసంకరశాసనములే యైయున్నవి. వీనివలన రానున్న యనర్థములు చెప్పనలవికాదు. "మీమతవిషయములలో మేము జోక్యము కలుగఁజేసికొనము, మీరే విచారించుకొను" డని విక్టోరియామహారాణిగారు చేసిన ప్రతిజ్ఞననుసరించి వచ్చుచున్న ప్రభుత్వమువారును నేఁడీవర్ణసంకరశాసనముల నంగీకరించియున్నారు. అదేమనిన మీప్రతినిధులేకదా యీశాసనములుకోరినది, మమ్మేల యడిగెదరని జవాబు చెప్పుచున్నారు. ఇంతియేకాదు. ఈవర్ణసంకరశాసనముల నంగీకరించువారు నూటికేయిద్దఱుముగ్గురు కన్న నెక్కుడుగలేరు. విషయమిట్టుండ మన శాసనసభాసభ్యులు "పనిలేనిమంగలి పిల్లితల గొరుగుట కారంభించినట్లు" వర్ణసంకరశాసనముల ప్యాసుచేయుటయేగాక వీనిని బ్రజలలో నూటికి డెబ్బదిమంది యంగీకరించిరనియు నెనుబదిమంది యంగీకరించిరనియుఁ బ్రభుత్వమువారి యెదుట నసత్యములఁజెప్పి చట్టముల నిర్మింపఁ బాటుపడుచున్నారు. ఈరీతిగ మన చట్టనిర్మాణసభాసభ్యులు మన కపకారముఁజేయుచున్నను నిట్టి వర్ణసంకరశాసనములు నిర్మించుట యిష్టములేనివారమయ్యును మనము మన యసమ్మతిని బ్రభుత్వమువారికిఁ దెలియఁజేయక మన్నుతినిన పాముంబోలె మౌనముద్ర వహించియున్నాము. ఈమౌనముద్రవలన నీశాసనములు నిర్మించుటలో విరుద్ధాభిప్రాయముగల సంఘమొకటి కలదనువిషయముకూడఁ బ్రభుత్వమువారికిఁ దెలియకుండుటయు నేకొలఁదిమందియోయగు సంఘసంస్కర్తనామధారులు లాంధ్రాదిపత్రికాముఖములఁజేయు నార్భాటముల నాలించుటయుఁ దటస్థించుచున్నది. అందువలనఁ బ్రజలందఱును నీశాసనములవిషయమై యనుకూలాభిప్రాయులైయున్నవారని నాశయముతోఁ బ్రభుత్వమువారు మనశాసన

సభాసభ్యులు తెచ్చెడి మతాచారవిరుద్ధ శాసనముల సంగీకరించుచున్నారు. కావున నిపుడు మనము చేయఁదగిన కార్య మేమన—

(౧) మేము మీకు మామతవిషయముల శాసనసభలలోఁ జర్చించి శాసనములనిర్మించుటకుఁగా మాప్రాతినిధ్యము నొసఁగియుండలేదు. మామతవిషయముల సంస్కరించి నూతనశాసనముల సృష్టింప భగవంతునికే యధికారము లేనియపుడు మీ కధికారముగలదని తలఁచి మీ రావిషయమై సంస్కరించి శాసనముల నిర్మించుట మీకు యుక్తముగాదని యిప్పటిశాసనసభాసభ్యులకు మహజరులనంపుకొనుట

(౨) మేము శాసనసభాసభ్యులకు రాజకీయార్థిక విషయములఁ జర్చించి తద్విషయమై మాకనుకూలములగు శాసనముల నిర్మింప మా ప్రాతినిధ్యము నొసగియుంటిమిగాని మతసాంఘిక విషయములఁ జర్చించి శాసనములనిర్మింప మాప్రాతినిధ్యము నొసఁగియుండలేదు. లేనిదే మావారు తమయభిప్రాయమునె మాయభిప్రాయమునుగా దమవద్దఁజెప్పుచున్నవారు. కాన నిదివరలో వారు తెచ్చియుండిన హిందూదేవాదాయ ధర్మాదాయ; గర్భాధానవయోనిర్ణయాది మత విషయకశాసనముల రద్దుచేయుటయేగాక ఇఁకమీఁద నట్టిశాసనములఁ దెచ్చినయెడఁ దాము వాని నంగీకరింపక విక్టోరియామహారాజ్ఞిగారుచేసిన ప్రమాణముననుసరించి మా మతమును గాపాడవలసినదని శ్రీ ప్రభుత్వము వారికి విజ్ఞాపనములనంపుకొనుట—

(౩) ఇఁకమీఁద శాసనసభాసభ్యులనుగా నెన్నుకొనువారిచే "మతసాంఘికవిషయమై మేము శాసనసభలలో నేవిధమగుచర్చయుఁ దీసికొనరామనియు, నితరు లెవరైన నట్టిచర్చలు తెచ్చినను వానిని నిరసించెదమనియు" ప్రమాణపూర్వక లేఖికపత్రము వ్రాయించుకొనవలయును, అందుల కియ్యకొననివారికి మన ప్రాతినిధ్యము నొసంగకుండుటయను నీకార్యత్రయమును మనము కావింపవలయును. లేనియెడల మనల నీశాసనసభాసభ్యులు వర్ణసంకరులఁ జేయుకమానరు. కాన నో సోదరవర్యులారా! మన్నుతినిన పాముం బోలె మౌనముద్ర వహింపకుఁడు. మన మౌనమే మనమతనాశనమునకుఁగారణము.

ఇట్లు పలుమంది పండితులును బత్రికలును నస్పృశ్యతానివారణమున కనభిముఖులైయుండుట కనఁబఱచియుంటిని. వాదరూపమైన యనభిముఖత్వ మటుంచి యాచరణరూపమైన యనభిముఖత్వమును వీక్షింపుఁడు.

24-2-26 ఆంధ్ర వార పత్రిక.

పాలఘాటులోని ఎజువాలను హిందువులలో అగ్రవర్ణముల వారు అస్పృశ్యులలో చేర్చిరి. సంఘగౌరవమును బడయుటకు యిటీవల కొన్నియేండ్లనుండి ఎజువాలు క్రైస్తవమతముల నవలంబించుచున్నారు. ఆర్యసమాజమువారు ఎజువాలను ఆర్యులనుచేయబూనిరి. కాలాపతిలో రథోత్సవమునకు వెళ్లుటకు తమకుహక్కు కలదని 1924లో ఎజువాలు కొందరు పట్టుబట్టగా కొంత తొందరకలిగినది. 31-10-25న ఆర్యులు కొందరు కాలాపతి అగ్రహారమునకు వెళ్ళుటకు ప్రయత్నించిరి. అచట నందరును శ్రోత్రియ బ్రాహ్మణులే నివసించుచున్నారు. ఆర్యులైనను ఎజువాలను రానీయమని బ్రాహ్మణులు పట్టుబట్టిరి. సంఘర్షణము జరిగినది. కొంతమంది బ్రాహ్మణులకు కత్తిపోటులు తగిలినవి. అందువలన మరల కొట్లాటజరుగకుండ అస్పృశ్యులు అగ్రహారములోనికి రాకూడదని 144 క్రింద ఉత్తరువు చేయఁబడెను.

4-11-25 ఆంధ్ర వార పత్రిక.

........ తిరుచానూరు దేవాలయములో పంచములొకడు ప్రవేశించుటయు కేసుజేయుటయు ఆవివరము లిదివరలో ప్రకటించియుంటిమి. ఇప్పు డాకేసులో మేజస్ట్రీటుగారు తీర్పుజెప్పుచు 75 రూపా. లు జరిమానాగాని అదియీయనియెడల 1 నెల కఠినశిక్షగాని అనుభవించునటుల తీర్పు చెప్పబడినది........

ఈ జరిమానాను, అపీలులోఁ దిరిగియిప్పించిరని భిన్నాభిప్రాయములుగాక యీక్రింది పంక్తులు తిలకింపుఁడు.

# LIV

## 1926-వ సం॥ జనవరి నెల 20-వ తేది; ఆంధ్రవార పత్రిక

# పంచముని దేవాలయ ప్రవేశము కేసు

### మహాత్ముని యభిప్రాయములు

ఈవారపు "యంగిండియాలో" మహాత్మ [illegible] వ్రాయుచున్నారు:—

దక్షిణాఫ్రికాలో జాతివర్ణభేదమను నేరమునకుగాను మనము శిక్ష నొందుచున్నాము. భారత దేశమున మనము హిందువులము మన తోటిమతస్థులనే జాతిభేద మను నేరమును బట్టియే దండించుచున్నాము. పంచమ జాతివాడు మహాపరాధి యగుచున్నాడు. దగ్గరకు రాగూడదు. తాకగూడదు. చూడగూడదు. ఇంకను ఎన్నైనను శిక్షలు గలవు. చెన్నరాజధాని కోర్టులో నొకచోట విచారణయైన విచిత్రపు కేసును జూచినయెడల నిమ్నజాతులు మనదేశీయు లెట్టి దుస్థితిలో నున్నారో తెలియగలదు. పంచము డొకడు విశుద్ధవస్త్రధారుడై భక్తిపరవశుడై యెవరిమనస్సునుగాని నొప్పింప నెట్టియుద్దేశ్యమును లేకుండ దేవాలయములోనికి బోయెను. ప్రతి సంవత్సరమును దేవాలయము లోనికి బోకున్నను అచటినుండి అర్చనలొసంగు నలవా టాయనకుండెను. అయితే గతవత్సరము ఆభక్తితన్మయత్వమున ఒడలు మరచి దేవాలయములోనికి ప్రవేశించెను. అచట నున్నపూజారి ఆయన యిచ్చిన పండ్లు తాంబూలముగూడ యితరు లిచ్చిన దానితో బాటు తీసికొనెను. కాని ఆయనకు స్పృహవచ్చునప్పటికి పొరబాటున లోపలికి వచ్చితి ననుకొని దేవాలయమునుండి పారిపోయెను. ఆయన నెరిగినవారు కొందరు వానిని పట్టుకొని పోలీసుల కొప్పగించిరి. దేవాలయ ధర్మకర్తల కీఅపచారము దెలియగనే ప్రోక్షణజేసి దేవాలయమును శుద్ధిజేసిరి. అంతట విచారణ జరిగెను. హిందూ మేజస్ట్రీటు ఆయనకు 75 రూపాయల జరిమానా విధించెను. లేదా

ఒక నెల శిక్షను స్వమతమును భంగపరచినందులకు అనుభవింపు మనెను. దానిపై అప్పీలు చేయబడెను. చర్చజరిగెను. తీర్పు నాపియుంచిరి. క్రిందికోర్టు తీర్పు తుదకు త్రోసివేయబడెను. ఈత్రోసివేయుట పంచమునకు దేవాలయమునందు ప్రవేశించుటకు హక్కున్నదని స్థిరపరచిగాక క్రిందికోర్టులో ప్రాసిక్యూషను పక్షము తప్పును నిరూపింపలేకపోయెనని చెప్పబడెను.

కావున నెవరెంత పెనఁగులాడినను ననాదికాలమునుండి యాచరణలోనుండుటయే కాక శ్రుతిస్మృతీతిహాసాదులచే నిరూపింపఁబడియుండిన యస్పృశ్యత యిప్పుడు తొలఁగవలయునన్న నెట్లుతొలఁగఁగలదు? క్రమముగా నన్నియనాచారములతో పాటదియు నేర్పడును. అట్టిదానికై గణపతిశాస్త్రిగారేమి గాంధిమహాత్ముఁడేమి కంఠశోష చేసికొనుట పనిలేనిపని. ఈయస్పృశ్యత నశించినఁగాని స్వరాజ్యము రాదనియు నైకమత్యముగలుగదనియు బోధించుట కేవలావివేకము. "పృష్ఠతాడనాద్దంతభంగ"యనుసామ్యమిచట సార్థకము. ఒకరి నొకరు తగులుచుండినఁగాని యైకమత్యము పొసఁగదనికదా మనవారిబోధ. ఒకరినొకరు ముట్టుకొనుటయేగాక యొకరిపాత్రలో నొకరు తినుచు నొకరిపక్కలో నొకరు పరుండు నన్నదమ్ములకే యొక్కొకచో నైకమత్యము లేక కోర్టులకెక్కి కొల్లబోవుచుండుట మనము కనులారఁ జూచుచున్నవారము. వేయేల! భార్యాభర్తలు ప్రత్యహము పరస్పర స్పర్శనమేగాక యొకరిముఖములో నొకరు ముఖముపెట్టుకొనుటయేగాక యుపగూహనమేకాక యొకరితేజస్సులో నొకరి తేజస్సునుగూడ మేళనము చేసికొనుచుందురు. అట్టి భార్యాభర్తలంతటను నైకమత్యముతోడనే యుండుచున్నారా? ఎందఱు పరస్పరవైరుధ్యముతోఁ బ్రవర్తించుటలేదు? కావున నస్పృశ్యత యైకమత్యభంజకమని యనుటకంటె నవివేక మన్యమేమియుండెడి? అదియే యనేకులఁ బట్టి వేధించుచున్నది. పండితుల

చేత శాస్త్రార్థములుగూడఁ జేయించుచున్నది. కావ్యకంఠ బిరుదాంకితులగు గణపతిశాస్త్రిగారివంటి ఘనులచేత గడబిడచేయించుచున్నది. గణపతిశాస్త్రిగారి శాస్త్రార్థమునకు రామకృష్ణకవులుగారి ఖండనము హూణభాషావిదులగు గొందఱకు నచ్చకున్నను పండితసమ్మతముగా నున్నయది. దీనిపై మరల నెన్నిఖండనముండనములు వారు వ్రాసికొన్నను నిష్ప్రయోజనముగనుక కవులవారు బదులువ్రాయరు. ఇదియే ఖండనము. విద్యాశేఖరబిరుదాంచితులగు అక్కిరాజు ఉమాకాంతముగారి ‘తెలుగుదేశమందలి చండాలుర’ను వ్యాసమునకుఁగూడఁ బ్రత్యుత్తరం బయ్యెడి.

ఈవిషయమున నింకను ననేకాంశములు తెలుపవలసియున్నను " సెట్టిసేరు లింగము సవాసే " రన్నట్లిప్పటికే పీఠిక చాలనైనది కావున రామకృష్ణకవులవారి యస్పృశ్యతానివారణము నస్పృశ్యతానివారణ ఖండనముల కనతలనుండు “వంటగానివా”ల్లను వ్యాసమును జదువుకొనఁ బ్రార్థించుచు విరమించుచున్నవాఁడను.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది
బహుగ్రంథకర్త,
జానపాటి పట్టాభిరామశాస్త్రి



నమ్మఁదగినది. యజ్ఞాదులందు మంత్రపూతములు చేసి వేయు నాహుతి ద్రవ్యములు లోకవిరుద్ధములుగ నున్నను దేవాదులకు మహాసుఖ దాయకము లగునట్టుల శాస్త్రములే చెప్పుచున్నవి. హవిర్భాగముల కొఱకు దేవాదులు వివాదగలవారగుదురనియు నా హవిర్భాగములు లేని దేహాదులు తక్కువవారనియు నవిగలవారి కాధిక్యముగలదనియు శాస్త్రముగలదు. దీనివలన వారికి స్వర్గాదిలోకములయం దెన్నివిష యసుఖములుండినను మనుష్యులచేఁ జేయఁబడు యజ్ఞాదులయందైన హవిర్భాగాదులు విలువలేని సుఖమును గలుగఁజేయునని తోఁచుచున్నది.

శ్లో॥ సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః। అనేన ప్రసవిష్యధ్వ మేషవో స్త్విష్టకామధుక్॥ దేవాన్భావయతా నేన తే దేవా భావయంతు వః। పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ॥ ఇత్యాదిగ్రంథముచే బ్రహ్మ యజ్ఞములతోఁ గూడఁ బ్రజల సృజించి యీ యజ్ఞములచే దేవతలను బూజింప వలసినది, దేవతలు క్రతుభుక్కులై వర్షాదులచే సస్యాదివృద్ధిగలుగఁజేసి కాపాడుదురని చెప్పియున్నాఁడు గాన నీలోకమందు మనముచేయు యజ్ఞాదులయం దీయఁబడిన హవిర్భాగాదులును దర్పణాదులును దేవాదులకుఁ దృప్తికరములగునని స్పష్టమగుచున్నది. శాస్త్రవిహితముగా స్నానాది కర్మము లాచరించవలెననియుఁ దదంగభూత తర్పణాదు లాచరించవలెననియు నుపదేశించుటచే మన మట్టు లాచరించుటయే కర్తవ్యముగాని కుయుక్తులచే విమర్శించు టనుచితము నన్యసంపాదకము. దేవపితౄదుల కాతర్పణాదులవలనఁ దృప్తి యొదవకున్నను మనము తరింతుము. అవి చేయనియెడల నీశ్వరాజ్ఞోల్లంఘనచేసినవారమై చక్రవర్తియాజ్ఞ ధిక్కరించు పురుషునవలెఁ గష్టముల ననుభవింతుము. సంకల్పాదులులేని స్నానములు పరమార్థసాధకములు గావు. గోత్రి

సామాదులతోఁ జేసిన దేవుఁడు తగినఫలమునిచ్చు. ఏకర్మముకైనను సంకల్ప ముండితీరవలెను. లేనియెడల నాకర్మ మాచరించినవారము గాము-ఈశ్వరుఁడు ప్రేమించఁడు-న్యాయస్థానములందు దాఖల్ చేయఁబడు కాగితములందు గ్రామనామాదు లావశ్యకమేకదా! అవిలేకుండ దాఖలుచేయఁబడుకాగిత ముపయోగించునా? అవిలిఖించి దాఖల్చేసిన కాగితములోని విషయములను విమర్శించి న్యాయాధిపతి న్యాయము గలుగఁజేయును. అటులనే దేవుఁడుగూడ సత్కర్మములు సంకల్పాద్యంగములులేనివైన నంగీకరించఁడు. దానిఫలము నీయఁడు - కనుక విధులఁదెలిసికొని యాచరించి యిహపరశ్రేయస్సులఁ బొందఁదగినది.

ఈరీతిగా బ్రాహ్మణుఁడు నిత్యము స్నానము సంధ్యావందనము బ్రహ్మయజ్ఞము పితృతర్పణము దేవతార్చనము వైశ్వదేవము మున్నగు కర్మముల నాచరించుచుండవలయును. క్షత్రియుఁడు వేదాధ్యయన సంపన్నుఁడై శ్రౌతస్మార్తకర్మానుష్ఠానపరుఁడై ప్రజాపరిపాలనాసక్తుఁడై యుండవలెను-వైశ్యుఁడు యజనాధ్యయనసంపన్నుఁడై కృషిగోరక్షణ వాణిజ్యాదివృత్తిగలవాఁడై యుండవలయును-శూద్రుఁడు ద్విజశుశ్రూషాపరుఁడై యమంత్రకముగా స్నానాదికర్మముల నాచరించుచు నుండవలెను-ఇటులఁ జతుర్వర్ణములవారును వారికి విధివిహితములగు ధర్మముల నాచరించి భగవదనుగ్రహపాత్రులై మోక్షసామ్రాజ్యమును బొందఁగలరు.





# నాగరఖండము.

## —♦ సప్తమాశ్వాసము. ♦—

క॥ శ్రీమల్లక్ష్మీగంగానామసుతాపాణిపీడనమహోత్సవ ద
త్తామూల్యసదుపధాచయ ! సామాత్యనికాయ ! శ్రీపరాంకుశరాయా ! ౧

ఆ॥ అవధరింపు, మవలియాఖ్యానమును జెప్పుమనుచు శౌనకాది మునివరేణ్యు
లడుగుటయును రౌమహర్షణి పరమేశు హృదయమున స్మరించి యిట్టులనియె, ౨

### —: చండశర్మభార్య శాకంభరిం బ్రతిష్ఠించుట :—

వ॥ చండశర్మభార్య, శాకంభరి సరస్వతీతటంబున దుర్గం బ్రతిష్ఠించి శేయుం
బవళ్ళు భక్తిచేఁ గొలుచుటయు నాయమ ప్రసన్నయై ౩

తే॥ "బిడ్డ ! నీచేయు తపమునఁ బ్రీతురాలనైనదానను, మంగళమగును నీకు,
నేమికోరెదో కోరుమీ వీక్షణమున నడ్డుచెప్పక సమకూర్చి యరుగుదాన" ౪

వ॥ అనవుడు శాకంభరి యిట్లనియె, ౫

తే॥ "హాస్యమునఁ బ్రీతిఁజెందెదేని హాటకేశమధ్యమస్థ చతుష్షష్టిమాతృగణము
లను బలులనిచ్చి భజియింప నొనరుసుకృత మీ త్వదర్చనకృజ్జన మెసయఁగాక"

వ॥ అనివేడుటయు నాదేవి ౭

ఆ॥ "ఆశ్వయుజశుక్లపక్షమం దరుగుదెంచు నలమహానవమిదిన మధికభక్తి
నను సమర్చించువాఁడు నీమనసులోని ఫలము సకలంబుఁ బొందు నప్పటికి నపుడె"

వ॥ అనిచెప్పి యంతర్ధానంబుఁజెంది శాకంభరియను పేరఁ బ్రఖ్యాతయయ్యె, నది మొదలుకొని సరస్వతీతీరంబునఁ బుత్రపౌత్రదౌహిత్రులతో వృద్ధిఁజెంది బహిష్కృతనాగర బ్రాహ్మణులు విద్యాధనంబులఁ జమత్కారపురబ్రాహ్మణులకుఁ దీసిపోక మహోత్కృష్టులై వర్తించిరి, కొంతకాలంబునకు విశ్వామిత్రుండు శపింప సరస్వతి రుధిరవాహినియై రక్షోభూతప్రేతపిశాచంబులచే సేవింపఁబడుటయుఁ దద్భక్ష్యమాణులై బహిష్కృతనాగర బ్రాహ్మణులు నర్మదాతటస్థ మార్కండేయాశ్రమంబునకుఁబోయి వసించి" రని యిట్లుచెప్పుటయు ఋషులు ౯

## —: గంగాజలంబుల శ్యామకర్ణంబులగు గుఱ్ఱములు పుట్టుట :—

కం॥ "ధీమచ్ఛ్రేష్ఠుండగు విశ్వామిత్రుం డేల నదికి శాపంబిడెఁ దా?
నేమి యపరాధ మొనరిచె నా మునికి మహానది? దయ ననఘా! చెప్పుమా" ౧౦

వ॥ అని ప్రశ్నించుటయు సూతుం డిట్లనియె, ౧౧

కం॥ "కలిగెను విశ్వామిత్రున కలఘు వసిష్ఠునకుఁ బూర్వ మత్యంతం బౌ
కలహము బ్రాహ్మణ్యముకై యిలామరవరేణ్యులార! యేమందు నికన్,

వ॥ విశ్వామిత్రుండు క్షత్రియుండయ్యు బ్రహ్మఁదొట్టి బ్రాహ్మణులందఱి చేతను బ్రహ్మర్షిగాఁ బేర్కొనంబడియెఁ గాని వసిష్ఠునిచేత మాత్రము పేర్కొనంబడఁ, డం దుచే నుభయులకును వైరంబు ఘటిల్లె" నని యిట్లు వాక్రువ్వ వెండియు శౌనకాదులు.

కం॥ "క్షత్రియుఁడయియును విశ్వామిత్రుఁడు బ్రాహ్మణులలోన మేటి యటుమ్యోన్,
ధాత్రభిమతుని వసిష్ఠుఁడు మాత్రము విప్రుఁడని యేలమన్నింపఁడు తాన్" ౧౪

వ॥ అనియడుగుటయు వెండియు సూతుం డిట్లనియె, ౧౫

ఉ॥ "ఉండెను మున్ కుశికుఁడను నొక్క మహాముని, ధాత్రి సుంతయున్
నిండఁగ స్వీయకీర్తి వ్రతనిష్ఠితుఁడై యతఁ డెంతయుం దపం
బుండుచుఁ దీర్ఘసేవ కనియోజఁ బ్రియాణము సేసి యోగనో
క్కుండ యొకప్డు భోజకటకంబను గాధిమహీశు వీటికిన్, ౧౬

వ॥ ఏగి యటనుండు కౌశికీనదిం గ్రుంకి తత్తీరంబునం దపించుచు సర్వావయవ శోభనయై యరుదెంచిన రాచకన్నియం బొడగాంచి మురువారి క[illegible] ౧౭

ఆ॥ "ఎవరికూఁతురీపె? యెందునిమిత్తమై యేగుదెంచియుండె నీస్థలమున?
కెచటికేగుచున్న? దింతయుఁ జెప్పుఁడీ వినఁగ వేడుకయ్యె జనములార!"

వ॥ అనియడిగిన జనులిట్లనిరి. ౧౮

కం॥ "ఏతత్త్రిలోక సుందరి ఖ్యాతుండగు గాధితనయ, కడుగుణవంతుం
డై తగు పెనిమిటిఁ బడయుటకై తా నేతెంచె గౌరి నారాధింపన్. ౨౦

ఉ॥ ఈనదియొడ్డునం జెలఁగు నెంతయు నున్నతమౌచు దేవతా
మానితయైన హైమవతి మందిర, మచ్చటికేగి యీమె పా
ద్యాద్యనముఖోపచారములఁ దద్దయు సల్పి శ్రవస్సుఖంబుగా
గానముఁ బాడి మాపటికిఁ గ్రమ్మఱ నేగుచునుండు నింటికిన్" ౨౧

వ॥ అనినవిని యతండు గాధిగృహంబున కరుగుటయు నాపార్థివుఁడు సమ్ముఖంబుగం బోయి కృతాంజలిపుటుండై

తే॥ "నిస్పృహుండవైన నీకును నేఁ డదేల రాకఘటియించినది మునిరాజ! యిటకు"
నడుపు మదియంతయును నాకుఁ దడయ కిపుడ, శ్రీమదిష్టంబు నెఱవేర్ప సిద్ధముంటి?
వ॥ అనినొడువుటయు ఋచీకుండిట్లనియె, ౨౪

కం॥ "వరవర్ణినియగు నీసుత సరగున నర్పించి పెండ్లిసల్పు మహీశా!
గిరిజగుడికడల నాఁడ దరిసించి స్మరార్తిఁ బడితిఁ దాళఁగఁ జాలన్" ౨౫

వ॥ అనినని గాధి యయ్యది యసవర్ణవివాహమనియు నతఁడు దరిద్రుండు
వృద్ధుండు ననియు నర్పింపకున్న నలుగుననియు నాలోచించి ౨౬

తే॥ "కన్యకాదానమున మాకుఁ గలదు శుల్క, మద్ది యొసఁగఁగదవేని మహాత్మ! నీకు
నాదు పుత్రికనర్పించి న్యాయ్యమైన పద్ధతి వివాహమొనరించి పంపువాఁడ" ౨౭
వ॥ అని వ్యాజంబుఁ బన్నుటయు ఋచీకుం డిట్లనియె, ౨౮

కం॥ "చెప్పుము కన్యాశుల్కం బెప్పగిదిని దీసికొనుట కేర్పఱచితివో,
గొప్పదెయగుఁ గాకది, నేఁ దప్పక యీ సిద్ధముంటి ధాత్రీనాథా!" ౨౯
వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయుఁ బార్థివుండు ౩౦

చం॥ "ఒకచెవి నల్లనై మిగిలియుండిన మై యఖిలంబుఁ దెల్లనై
ప్రకటితవాయువేగమునఁ బాఱెడిగుఱ్ఱము లేడునూరు లో
డక యెవఁ డిచ్చు వానికి నిడంగలవాఁడను నాదుబిడ్డ, దీ
నికి నిఁక భిన్నమార్గమున నేను బ్రవర్తిలఁ జాల సంయమీ!" ౩౧

వ॥ అని వక్కాణించుటయు నమ్ముని వల్లెయని కన్యాశుల్కంబునకుం జని గంగాతీరంబునం బ్రవేశించి "అశ్వావోఢ" యను సూక్తంబును జపింప సర్వశ్వేతంబులును శ్యామైకశ్రవణంబులును నగు నేడునూఱుల గుఱ్ఱంబు లేడునూఱుల సాదులతోడం గూడి గంగాజలంబునుండి బయలు వెడలె, నాఁటగోలె నయ్యది యశ్వతీర్థంబని విఖ్యాత, మంత ఋచీకుండు వారూత్తమంబుల భోజకటకంబునకుఁ దోలించుకొనిపోయి గాధికొప్పఁజెప్పుటయు నాతఁ డవ్వానిఁ దీసికొని కూఁతునిచ్చి వివాహంబు గావించె, నట్లు పాణిపీడనంబు పరిసమాప్తిగా మునివర్యుఁ డామెతోఁ గాపురంబు చేయుచు సంతోష సమయంబున వరంబు గోరుకొనుమన నాకె పోయి తల్లికిఁ జెప్ప నాయమ యిట్లనియె,

కం॥ "తనయరో! నీపతి నీ కత్యనుకూలుండగుచు వాంఛితార్థం బిడు నా
ననఘుం బగు బ్రాహ్మణ్యము నెనసిన యొకయాత్మజాతు నిమ్మను మెలమిన్, ౩౩

కం॥ పుత్రకులు లేకయుంటిని బుత్రీ! నే, నరిమువలనఁ బోయి త్వదీశుక్
ష్మాత్రంబు గలిగి వర్తిలు పుత్రుని నాకును నొసంగఁ బురికొల్పఁగదే" ౩౪

వ॥ అనినవిని యాయువతి బుచీకుని సమీపించి జనని చెప్పినదంతయుం జెప్పినవిని యతండు పుత్రేష్టియందు బ్రహ్మతేజస్సహితంబుగా నొకటియు క్షత్రతేజస్సహితంబుగా నొకటియు రెండు చరువులు సిద్ధపఱచి బ్రాహ్మ్యచరువు భార్యకిచ్చి ౩౭

క౦॥ "దీనిం బ్రాసించి కరీణ్యాగా! యశ్వత్థపాదపాలింగనముఁ
బూనికఁ గావింపుము, సత్పూనుని గనె, దతఁడు బ్రాహ్మణ్యశోభితుఁడగుఁ దాఁ,

క౦॥ రెండవచరువు త్వదంబ, దఖండన్యగ్రోధతరువుఁ గౌఁగిటనిడ నా
ఖండేందుఫాలకుం బుత్రుం డుదయించెడిని క్షాత్రరూపముతోడఁ, ౩౭

వ॥ అనిచెప్పిపంపుటయు నత్తరుణు లిరువురును సంతసంబునం బొంగిరి, పదపడి తల్లి బిడ్డంగూర్చి ౩౮

శా॥ "సామాన్యంపు స్వకార్యమందును జనుల్ శ్రద్ధాళులైయుండి తా
మేమాత్రంబో విశేషముంచుదురు పుత్రీ! కాన నమ్మాని పెం
డ్లామౌ నీకిడియున్నయట్టి చదువుఁ మంత్రప్రభావాన్వితం
బై మీఱం బొనరింపకుండఁ, డిది సత్యంబయ్యెడిం, గావునఁ ౩౯

క౦॥ నాచరువు నీవుగొనుము నీచరువును నాకొసంగు నీరేజముఖీ!
నాచెట్టును నీవేకొని నీచెట్టును నాకొసంగు నేస్తముతోడఁ, ౪౦

ఆ॥ దాన సామ్రాజ్యధారేయుఁడైనయట్టిసుతుఁడు నాకుజనించెడి శూరుఁడగుచు
భూమిసురమాత్రుఁడైనచోఁ బుత్రి! నీకు భూరిసంతోషమీఁజాలుఁ బుత్రుఁడరయ"

వ॥ అని చెట్లయెడలను జరువులయెడలను వ్యత్యయంబుగావించె నంత నయ్యింతు లిరువురును ఋతుస్నాతలై భర్తృసంయోగంబున గర్భంబులు ధరియించిరి, గర్భిణియైన యా త్రిలోకసుందరి చేష్టితంబుం దిలకించి ఋచీకుండు ౪౨

క౦॥ "ఛీ పాపిని! నీచేసిన యీపని యేమిటిదె? నీకు నిచ్చినచరువుఁ
నీ ప్రసువునకిడి యాపెది నాపడితి యథేచ్ఛనీవు శ్రమ విఫలముగాఁ ౪౩

సీ॥ ఆపెకుంజెప్పిన యల వటవృక్షముం జేరి నీకౌఁగిటఁజేర్చినావు,
నారచీరల మూలఁ బాఱవైచి యమూల్యచీనాంబరములఁ గైసేసినావు,
కస్తూరిమొదలైన గంధవద్ద్రవ్యంబు లొడలినిండంబూయఁగడఁగినావు,
అవనీసురార్హమౌ నాచారములవీడి రాచకీవివహింపఁ జూచినావు,
వరుస జపముం దపంబును వదలినావు, అరుణుపొడుపున స్నానంబె మఱచినావు,
ఈదృశంబగు నీచేష్టలెల్ల నేను దెలిసి చీయనునందాఁకఁ దెచ్చినావు, ౪౪

సీ॥ శమదమంబులులెస్స సాధించి నీతల్లి పృథివిఁ దాపసినాఁగఁ దేరుమోసె,
జపహోమములఁ జాల సల్పి యెప్డుఁ ద్వదంబ యఘువినిర్ముక్తయుం చనఁగఁబడియె,

గొప్పతీర్థములందుఁ గ్రుంకి నీజనయిత్రి పరిశుద్ధురాలునాఁబడియె జగతి,
స్వాధ్యాయపాఠముల్ శ్రవణించి నీయమ్మ ధీమతియని పేరుదెచ్చుకొనియె,
క్షత్రియాంగన యిట్టు బ్రహ్మచర్యంబూని బ్రాహ్మణివలె రాచరీవికిం బాలుపడెను,
కాన క్షత్రియుండే నీకుఁగలుగుఁబో మున్ముబ్రాహ్మణునిగాంచనాసెయే పాత్రురాలు,
తే॥ వేకటిధరించు స్త్రీలు వేవిళ్ళననుసరించియే తార సంతతిఁ గాంచుచుందు,
రట్టిభావంబు లయ్యెడ నేరుపడునొ యట్టిపుత్రుండుగలుగుఁ దదంగనలకు,
వ॥ అని వాక్రుచ్చుటయు నాయమ చేతులుజోడించి దీనవదనంబున నిట్లనియె,
మ॥ "భవదుక్తంబు యథార్థమయ్యెడిఁ బ్రభూ! బాహ్యంపుఁజిహ్నంబులె
య్యవియుం జూడక చెప్పుచుంటివి యతీతానాగతోదంతముల్,
భువిరాజ్యాలున కీవు తండ్రివగు టెప్డుం గూడ, దక్లాటచే
ప్రవరుండైన ద్విజుండె నాకు సుతుఁడై ప్రాలం బ్రసాదింపుమా" ౪౮
వ॥ అని యిట్లు నొడువుటయు ఋచీకుండు ౪౯
తే॥ బ్రహ్మతేజోయుతంబౌచుఁబరగ నీకు క్షత్రతేజోన్వితముగ నీజననికిని జ
రుద్వయం బొసగూర్చ మాఱుపునొనర్చితింత దీనికి వ్యత్యస్త మెట్లొనర్తు, ౫౦
తే॥ అబల! శాస్త్రవ్యతిక్రమ మాచరింప నధముఁడని నన్ను నిందింతు రవనిజనులు,
ఏమిచేసితొ చేసితి, వింక దీని కన్యథాయొనరింపఁ గా దయగు మవల
వ॥ అని పలుకుటయుఁ దత్పత్ని మఱియు నిట్లనియె,
తే॥ అట్టులగుచోఁ ద్వదాహృతమైనయట్టి క్షాత్రతేజంబు మత్పౌత్రగాత్రమునఁ బ్ర
విష్టమగుఁగాక, నీకన్న వేత్తయైన బ్రాహ్మణుండె కుమారుఁడై పరఁగవలయు ౫౩
వ॥ అనవుడు ఋచీకుండు ౫౪
ఆ॥ "అట్లె నీదుపుత్రుఁ డవనీసురశ్రేష్ఠుఁడగును సంతసిమ్ము చిగురుఁబోఁడి!
పౌత్రుఁ డధికమైన క్షాత్రంపుఁదేజాతో యుద్ధదుర్ధరత్వ మొందఁగలఁడు" ౫౫
వ॥ అని పలుకుటయు నాయమ యంతయును దల్లికి నివేదించి పదియవమాసం
బున బ్రాహ్మ్యలక్ష్మీసమేతుండగు కుమారుంగనియె, నాయన జమదగ్నియన విశ్రుతుం
డయ్యెఁ, దత్పుత్రుండు రాముండన మహాయశుండై యిరువదియొక్కమాఱులు ధాత్రి
నిఃక్షత్రియంబొనరించె, గాధిభార్యయు దశమ

## —♦ విశ్వామిత్రుఁడు రాజ్యమును వదలిపెట్టుట ♦—

మాసంబున బ్రాహ్మ్యలక్ష్మీసమావృతుండగు పుత్రుంగాంచె, నతండు విశ్వామిత్రుండన
దినదినప్రవర్ధమానుండై యౌవనంబువహించియుఁ బితృపైతామహంబగు స్వరాజ్యంబు
నిచ్చగింపక నిత్యంబును వేదాధ్యయనసంపన్నుండై బ్రాహ్మణోచితమార్గంబున నుండు

చున్నను గాధి స్వరాజ్యంబున నియోజించి సకళత్రంబుగా వనంబునకుఁజనియె, విశ్వామిత్రుండు రాజ్యస్థుండై కొంతకాలంబునకు మృగయావ్యసనంబునం దగిలి యడవి కరిగి

సీ॥ దుష్టులవన్నింటిఁ దునుమాడి తునుమాడి యడవిదున్నలఁబట్టి యవనిఁగూల్చి
ఖడ్గమృగంబుల ఖండించి ఖండించి పృథువరాహంబులం బిలుకుమార్చి
మదవృకేసంగుల మ్రందించి మ్రందించి క్రూరసర్పంబులం గూల్చివైచి
పులులమొత్తంబులం బోకార్చి పోకార్చి బలుసివంగుల నేలఁ బండఁబెట్టి
సింహములమీఁదఁబడి కొట్టిసంహరించి శరభములఁద్రుంచి మధ్యాహ్నసమయమునకు
క్షుత్పిపాసలకుం జిక్కి సొక్కిమిగుల నల వసిష్ఠాశ్రమంబున కరుగుటయును, ౫౭
వ॥ అమ్మౌని యెదురేగి యర్ఘ్యమిచ్చి యాగమనకారణమడుగ, ౫౮
ఆ॥ "వేటలాడియలసి గాటంపుదప్పిచే మంచినీళ్ల కరుగుదెంచినాఁడఁ,
జల్లనీరుఁద్రావి శ్రమఁబాసినాఁడ, నిం కాజ్ఞయిడిన నింటి కరుగువాఁడ" ౫౯
వ॥ అని నొడువుటయు వసిష్ఠుండిట్లనియె, ౬౦
తే॥ "మట్టమధ్యాహ్నమైనది, చట్టు లగల వెలుఁగుచున్నాఁడు వినువీథి వేఁడివేల్పు,
కాన భుజియించి యపరాహ్నమైన వెనుకఁ బయన మొనరింతు నిలువు నృపాల! నీవు"
వ॥ నావుడు విశ్వామిత్రుండు ౬౨
కం॥ "చతురంగసైన్యములతో యుతముగ నిట కరుగుదెంచియుంటిని, నది ద్వ్యర్థిత, పుట్టుగాన నవిలంబితముగ నా కాజ్ఞయిమ్ము మెల్లగఁ జనెదన్, ౬౩
కం॥ తన సేవకు లాఁకలిగొని కనుగొనుచుండంగ వారిఁ గాదని యొకఁడే
తినువాఁడు గుణవిహీనుఁడు, ఘన నరకములోనఁగూలుఁ గడ కతఁ డరయన్"
వ॥ అని పలుకుటయు వెండియు వసిష్ఠుండిట్లనియె,
ఉ॥ "ద్వారమునందు నీభటులు తారు బుభుక్షితులై వసించుచో
వారలనందఱం బిలువు, వైళమ తృప్తులఁజేసెదను, మ
ద్భూరితపఃప్రభావమునఁబొందిన నందినియన్ సుధేను వేఁ
గోరిన యేపదార్థమును గొంకక యిచ్చుచునుండు నిచ్చలున్" ౬౬
వ॥ అనినవిని సైన్యంబును రప్పించి స్నాతుండై నూరుచుండుటయు నందిని వసిష్ఠుచేఁ బిలువంబడి యేమియాజ్ఞయనిన నమ్మౌని ౬౭
మ॥ "సబలుండై చనుదెంచినాఁడు మన విశ్వామిత్రరాజర్షి, యా
పలువుర్ భృత్యులు సంతసింపఁ దొరగా భక్ష్యంబులున్ భోజ్యముల్
సబహూకారముగా నొసంగి తదిభాశ్వగ్రాససంతృప్తిఁజే
యుము బలీయంచు భవన్మహత్త్వమును దా నుర్వీశుఁ డగ్గించెడిన్ ౬౮

వ॥ అనిచెప్పుటయు నయ్యాది వల్లెయని తత్క్షణంబ పదివేలమందికి సరిపడు పదార్థంబును సృష్టించె, నంతఁ దద్భృత్యులు వడ్డించిరి, క్షణకాలంబులో నిట్లు సపరివారంబుగా సంతృప్తినొంది విశ్వామిత్రుఁ డాశ్చర్యపడుచు మంత్రులంజూచి ౧౯

మ॥ "అహాహో! యెంతవిచిత్రమియ్యది, కరం బాకంటికిం జిక్కియు
న్న హయేభోష్ట్రముఖాఖిలాస్మదురుసైన్యం బేను మీరందఱుక్
బహుధా తృప్తిపడంగ మృష్టమగు నన్నంబుం బ్రసాదించి భూ
రిహితంబుం బొనరించె నిమ్మొదవు మంత్రిశ్రేష్ఠ! లీక్షింపుఁడీ, ౨౦

కం॥ కావున నీయావును గొనిపోవుద మెట్లైన మనము పొంక, కరణ్యా
నీవాసి భృత్యహీనుఁడు నా విప్రుండితఁడు చేయునది యేముండున్" ౨౧

వ॥ అని వసిష్ఠుం బిలిచి ౨౨

ఉ॥ "నందిని నాకొసంగు మునినాథ! యరణ్యమునన్ వసించు నీ
కెందులకిద్ది యొక్కనికి? నిచ్చెద దీనికిఁ గాను నీకు నీ
డెందము చందముం దెలుపు, కీర్తిఁ జెలంగు హయంబులో కరి
వృందమొ యగ్రహారములొ యేవొ త్వదిష్టములన్ వచింపుమా" ౨౩

వ॥ అని యడుగుటయు నతండిట్లనియె, ౨౪

ఆ॥ "హోమధేనువిది నృపా! మాకుఁ గామదోహినియు, నందువలన నీయనేను,
క్ష్మాసురునకుఁ దలఁప సామాన్యమాగోవె యమ్మఁదగదు, దీని నమ్ము టెట్లు,

ఆ॥ ఆవునమ్మియెవ్వఁ డర్థంబు గ్రహియించు వాఁడు పంచముండు వాస్తవముగ;
జననినమ్మునట్టి చండాలుఁడే యతం డని వచించె మనువు విను జనేశ! ౨౫

ఆ॥ దానసామభేదదండంబులకు నేను సాధ్యపడెడునట్టి జనుఁడఁగాను,
వేయునేల దీని నీయ నెన్నటికిఁ, జనుము తిన్నగాను స్వగృహమునకు" ౨౬

వ॥ అనవుడు విశ్వామిత్రుండు ౨౭

ఆ॥ "రసఁ జెలంగునట్టి రత్నంబులన్నియు రాజకీయములుగ రహివచింతు,
రిదియు రత్నభూత, యే దండమున నేని గొనుదుఁ గాన సామమునను యిమ్మ"

వ॥ అని పలికి పట్టుకొనుండని భటుల కాజ్ఞాపింప వారు లగుడపాషాణంబులఁ గొట్టి కట్టివేయుటయుఁ దన్నందిని యఱచుచుం బోయి ౨౮

క॥ "ఇచ్చితివో కో నను కౌశికి నచ్చిరితా! యతనిభటులు స్వాములవోలెన్
వచ్చి ప్రహరింపఁజొచ్చిరి, నొచ్చె మదీయాంగమెల్ల, నోరాడ ధీకస్" ౨౯

వ॥ అని యడిగిన వసిష్ఠుం డిట్లనియె, ౩౦

తే॥ "పాశిణము ల్కాంతగతములో పట్లు నేని యిచ్చుటకుఁగాఁ బ్రయత్నింప నేననిన్నుఁ
గాన నీదేహమును నీవు కాచుకొమ్ము పొమ్ము నందిని! మత్ప్రభావమ్మువలన"

వ॥ అని చెప్పుటయు నయ్యావు నిష్ఠురంబుగా నఱవఁ దచ్ఛబ్దంబులనుండి సాయు
ధులై మ్లేచ్ఛశబరపులిందులు లెక్కకు మిక్కిలియై యుదయించి విశ్వామిత్రబలంబుల
వెనుకకుఁ దఱిమి, రంత నమ్మహీపతి చతురంగసైన్యసహితంబుగా సమరంబు సలుపు
టయు నామ్లేచ్ఛు లశ్వగజపదాతుల హతముచేసిరి, హతశేషు లవలకుఁ బాఱిరి,
మ్లేచ్ఛులు మేదినీశ్వరుం బట్టుకొనిరి, వసిష్ఠుఁ డది విలోకించి నందినిం బిలిచి ౬౪

కం॥ "తురకలచే నావృతుఁడగు నరపాలుని గావుమమ్మ నందినిరో! త
త్కారణం బ్రజ సత్పథమునఁ జరియించు, నమార్గమునను జను లేకున్నన్"

వ॥ అనుటయు మ్లేచ్ఛాదుల వారించుటకుఁగా వచ్చుదాని విశ్వామిత్రుండు
కత్తిచే వ్రేయ మొదలిడియె, వసిష్ఠుఁ డతని బాహుస్తంభనం బొనరించె, నంత నతండు
వసిష్ఠు నుద్దేశించి ౬౫

కం॥ "కఱకుం దురకలచేతను బోరిగొనఁబడుచున్నఁ గాచి భూసురవర! స
త్కారణను బాహుస్తంభన పరివర్జితుఁ జేయుమయ్య, ప్రస్తుతి సేతున్,

ఆ॥ మదపరాధమునను సదమదమయ్యె నాసైన్యమెల్లఁ, గానఁ జనుదు నింకఁ,
గానఁబడదు నాకుఁ గాసంతయేని ప్రయోజనంబు చూడ యుద్ధమునను,

ఆ॥ దుర్వినీతుకడకుఁ దోతెంచు సిరి విద్యచాల కాల ముండఁజాలదఁట,
నతిమదమున గర్వినై యున్న యట్టి నే నాలమునను నిల్వఁజాలనట్టు" ౬౬

వ॥ అని ప్రార్థించుటయు నట్లు కావించి వసిష్ఠుండు నవ్వుచు నిట్లనియె, ౭౦

కం॥ "మన్నీఁడ! స్తంభదోషము చన్నది నీభుజమునందుఁ జనుమింటికిఁకన్,
దిన్నయిలుఁ గుద్దలింపకు, మెన్నడుఁ బగఁబెట్టుకొనకు మీఁక విప్రులతోన్"

వ॥ అని విడిచిపుచ్చుటయు విశ్వామిత్రుండు క్రీడాయుతుండై వీటికరిగి

ఆ॥ "క్షాత్రబల మిసీ! యసారంబు, తద్వీర్య మంతకన్నఁ గడు నిరర్థకంబు,
బ్రహ్మబలమె బలము పరికింప, నవ్వారి తేజమే యమోఘతేజమరయ,

కం॥ ఏతద్బ్రహ్మబలంబును నేతీరుననైన నేను నెనయఁగవలయున్,
బోతలనాఁటి స్వరాజ్యము ప్రీతిం ద్యజియించి తపము పెంపఁగవలయున్"

వ॥ అని నిశ్చయించుకొని రాజ్యమందు విశ్వసహుండను తన కుమారు స్థాపించి
తపోవనంబునకుఁ జనిరియె, ౭౧

# అభినవసరస్వతి.

సంపాదకుడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపబడును. చందా రు 1 8 0—0

ఈ కార్యస్థానమున దొరకెడి పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కరిశోకోద్ధారిణి [పూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు | | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దార్థము | | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 10 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 11 | పునర్వివాహము (పత్రికాధిపతి) | ... | 0 | 1 | 0 |
| 12 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 13 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0 | 1 | 0 |
| 14 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 3 | 0 |
| 15 | పశ్యంపశ్యం | ... | 0 | 2 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 17 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 18 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 19 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 20 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 21 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 22 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము | ... | 0 | 1 | 0 |
| 23 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము (౧ సంపుటము) | | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 26 | భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 27 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |

అభినవసరస్వతి కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరుజిల్లా.